# ఇ ష్పా హా నీ టో నీ క్

రాబోవునంతటిని సంతోషకరమైనదిగను

ఆరోగ్యకరమైనదిగను తయారుచేయును

శిశువుల మొక్క మృదువైన జీర్ణకోశములను వృద్ధిపరచును. మరియు వారిని అన్నివిధములైన శిశురోగములనుండి కాపాడును. పండ్లు వచ్చునపుడు కలుగు జబ్బులకు చాలా ప్రయోజనకరమైనదని నిరూపించబడినది.

అన్ని చోట్లను దొరకును

తయారుచేయువారు:—

హైదరాబాదు కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్

Khan andsons) హైదరాబాదు-దక్కను

## శ్రీరామకృష్ణ ప్రకృతి చికిత్సాలయము

మునులతోట. రేపల్లె తాలూకా గుంటూరుజిల్లా.

యిచట ఔషధములు ఆపరేషన్లు, యింజక్షన్లతో నిమిత్తము లేకుండ యోగవ్యాయామ, వివిధ ప్రకృతి చికిత్సావిధానములచే కుష్టు, బొల్లి, ఉబ్బసము, క్షయ, మూర్ఛలు, పిచ్చి, నపుంసకత్వము, వంధ్యత్వము, మరియు స్త్రీవ్యాధులు మొదలగు మానవులకు సంక్రమించు సమస్త శారీరక, మానసికరుగ్మతలు నివారింపబడును. మరియు స్థూలదేహులు సన్ననివారుగను, దుర్బలశరీరులు బలిష్టులుగను, అందవికారులు సౌందర్యవంతులుగను చేయబడుదురు. సుఖప్రసవమును గోరు గర్భవతులు ప్రసవించుటకు 2-3 మాసములుముందుగా చికిత్సాలయమునకు చేరుకొనవలెను.

వివరములు కోరువారు 0-6-0 పోస్టుబిళ్లలు పంపిన "ప్రకృతి వైద్యము" గ్రంథము పంపబడును.

డా. జె. సి. ఘోష్, ఎం. ఏ

యఫ్, సి యస్, (లండన్) యం, సి, యస్, (అమె)

ఆయుర్వేదశాస్త్రి, భాగల్పూర్ కాలేజీలో పూర్వపు రసాయనిక శాస్త్రాచార్యులు

## ప్రకటన

15-1-1944 నుండి శ్రీనివాస మెడికల్ అండు ఫ్యాన్సిమార్ట్సు రేపల్లె (గుంటూరుజిల్లా) వారిని మద్రాసు రాజధానికంతకు దేశీయసంస్థానములతో సహా మా సోల్ ఏజంట్లుగా ఏర్పాటుచేసినామని సంతోషముతో తెలుపుచున్నాము.

కనుక, మా ప్రోత్సాహకులు, ఏజంట్లు గ్రాహకులు, మా సోల్ ఏజంట్లను యిదివరకుకంటె నధికముగా సహకారము చేయుదురుగాక యని కోరుచున్నాము

మా ప్రోత్సాహకుల కందరికి వసతి చేయునది యింకా యేమనగా, ప్రస్తుత పరిస్థితుల ననుసరించి యీ క్రింది ఔషధముల వెలలు యీ క్రిందివిధముగా హెచ్చించినాము

| | | | | | |
|---|---|---|---|---|---|
| మృతసంజీవని | 11 ఔన్సులు | 3 0-0 | శారిబాదిసరస | 8 ఔన్సులు | 1- 8-0 |
| మృతసంజీవని | 22 ,, | 5 8-0 | | 16 ,, | -13-0 |
| చ్యవనప్రాశ | 1 శేరు రు 6 అర్ధశేరు రు 3 | | | 24 ,, | 4- 2-0 |
| | పావుశేరు 1-8-0 | | | | |

ఇతర ఆసవములు, అరిష్టములు 3 ఔన్సులబుడ్డి 1-2 0 16 ఔన్సులు 2-0-0 24 ఔన్సులకు రు 2-14-0. వీటిలో కర్పూరారిష్ట, దశమూలారిష్ట కస్తూరి, మహాద్రాక్షారిష్ట 6 సం॥ పాతవిచేరవు

## సాధనౌషధాలయము

ఢక్కా (బెంగాల్)

ప్రఖ్యాతివహించిన ఆయుర్వేదౌషధాలయము

### ఆర్యానుపారశాల స్థాపన

బి. యం. గుప్తగారి అధ్యక్షతన

జోగిపేట, ౧౨-౨-౪౪

జోగిపేట అందోలు తాలూకాకు చెందిన పట్టణం ఇచ్చటనివున్న జాతిప్రజలు దాదాపు అయిదువందలవరకుగలరు ఈ ప్రజల ఆర్థిక నైతిక వైజ్ఞానిక అభివృద్ధికొరకు సహాయమునులేదు. స్థానిక ఆర్య సమాజం ఈవిషయమై శ్రద్ధతీసుకొని ఒక పాఠశాలను ఆర్యానుపారశాలయను నామముతో స్థాపించి 36 గురుబాలురకు విద్యనభ్యసించు అవకాశం కలిగించినది ఆర్యసమాజమందిరమందు హైజాతుల బాలురకు సంబంధించిన పాఠశాలయొక్క ఉపాధ్యాయులే ఈ ఆర్యానుపారశాలను నడుపించు భాధ్యతను అంగీకరించినారు.

౨౦-౨-౪ తేదులలో ఢిల్లీలోజరిగిన ఆర్యకాంగ్రెసు సమావేశమునకు జోగిపేటఆర్యసమాజమున పక్షమున శ్రీయుతులు బస్వ మాణయ్యగుప్తగారు ప్రతినిధిగా సమావేశము నందు పాల్గొనివచ్చిరి. ఆ సందర్భమున వారికి బ్యాండు వాద్యములతో స్వాగత మొసగిరి. మార్గమధ్యమున పూలహారములు మరియు చేతపడకినపూలమాలలచే శ్రీవారు గౌరవింపబడిరి.

### విషాదసభ

గొట్టిపర్తి, తా॥ సూర్యాపేట.- 3వ మార్చి ౧౯౪౪ నేడు సాయంత్రము ౫ గం॥కు శ్రీమతి కస్తూరిబాయి గాంధి మృతికిగూర్చి శ్రీయుత అనంత రామరావుగారి అధ్యక్షతన విషాదసభ జరిగెను. శ్రీమతిగారి స్మారకమునకై తగుఏర్పాట్లు జరుగుటకు తీర్మానించబడెను.

### శ్రీ వైదికాంధ్ర బాలికపాఠశాల సానుభూతి సభ

నల్లగొండ,

నల్లగొండజిల్లా స్థానమునందు ౧౫ సంవత్సరములనుండి స్థిర నివాసమేర్పరచుకొని ప్రజాహితజీవనము గడపుచు, స్థానిక ఆర్యసమాజ అధ్యక్షులును, బాలికాపాఠశాల సంయుక్త కార్యదర్శియు వివిధ ప్రజాహిత సంస్థాభిమానియునుఅగు పాండురంగారావుగారి అకాలమరణమునకు సభవారు తమ విషాదమును వెలిబుచ్చుచున్నారు.

పైతీర్మానము ౧-౩-౪౪ యం. నారాయణ రెడ్డిగారి అధ్యక్షతమునజరిగిన సమావేశమున చేయబడినది.

### నల్లగొండ

శ్రీ॥ శ్రే॥ శ్రీమతి కస్తూరిబాయి గాంధి గారి నిర్యాణమునకు సంతాపమును వెలిబుచ్చుటకు "శ్రీ వైదికాంధ్ర బాలికాపాఠశాల' భవనమునందు సభ జరుపబడెను. అందులో సంతాపతీర్మానము యావన్మందిపుర ప్రముఖులచే ఏకగ్రీవముగా ఆమోదించబడెను

పైతీర్మానము ౧-౩ ౪౪ బుధవారం సాయంత్రము శ్రీమాన్ యం. నారాయణరెడ్డిగారు వకీలుగారి అధ్యక్షతలో పాఠశాల పాలకవర్గ సమావేశమున జేయబడినది.

## రఘునాథ్ మల్

బ్యాంకర్

ఆబిద్‌రోడు హైద్రాబాదు- దక్కన్.

అన్నిరకముల బ్యాంకు వ్యవహారములు సరసమగు పద్ధతులలో జరుపబడును.

బ్రాంచీలు:—

జేమ్సుస్ట్రీటు సికింద్రాబాదు.

శాక్ మార్కెట్

## దీర్ఘరోగములు

ఎంతకాలమైనను కుదరక, ప్రాణమువిసిగి ఇక మరణమే నిశ్చయమనుకొన్న దీర్ఘ బాధ మొండి రోగములు, ఇంజక్షనులకు లొంగనిమొండిరోగములకు కుదరక, ఎంతోగొప్ప పరీక్ష చేసినవారైనను అత్యంత బాధ్య డాక్టర్లకు అనుభవం చేయుటుటకే కుదురుట కష్టం. స్త్రీ పురుషులకు పిల్లలకు వచ్చెడి దీర్ఘ కఠినరోగము లేవైనను కుదుర్చుటకు వృద్ధ వైద్యులకు మ చికిత్సాప్రాయము 60 సం॥ల వయస్సు, 30 సం॥లనుండి అనేక వేలకు దక్షిణ బ్రిటిష్ నిజాం రాష్ట్రమంతటను చికిత్సచేసి మంచి అనుభవముకలిగి, 3 రోజులలో కొంతగుణం చూపుటకు గ్యారంటీ మావద్దకు వచ్చి కుదుర్చుకొనని పిమ్మట, వారి యింటివద్దనేయుండి మందులు సేవించుచూ ఆరోగ్యము పొందగలరు ఇచ్చటకు వచ్చినవారికి అన్ని వసతులు చూడగలము. జవాబు బిళ్లలు పంపవలెను.

డా. రత్నం అండ్ సన్సు, మెడికల్ హాల్

252-బి, సుల్తానుబజారు, హైదరాబాదు.

## క్రిష్ణానిషాత్ హేర్ ఆయిల్

రిజిస్టర్డు నెం. ౨౧౨..

ఈ తైలము నుపయోగించిన మెదడునకు పుష్టి, కండ్లకు చలువ కలిగించి, నిద్రలేమి, వెంట్రుకలురాలుట, ఇంద్రలుప్త [అనగా బట్టతల, చుండు మొదలగు దుర్గుణములను పోగొట్టి వెంట్రుకలు మృదువుగను గుబ్బగను, ఆకర్షణీయముగా పెరుగుటకుపకరించును.] ఈ తైలము ప్రత్యేకముగా బట్టతలయున్న వారు కూడా వాడినపక్షమున ఒకనెలలోపల వెంట్రుకలు ఆకర్షణీయముగావచ్చును- ఈ తైల లేపనమున వయసమించిన వారుకూడ నవయువ్వనులవలె కనబడుదురు. వెల సీసా ౧కి రు. 1-8-0

క్రిష్ణా అండ్ బ్రదర్సు ఈసామియాబజారు, హైదరాబాదు-దక్కన్.

## అల్ఫా

కుసుమవ్యాధి, వీర్యనష్టమును తక్షణమే పోగొట్టును మరియు నిర్వీర్యులకు చైతన్యము నిచ్చును.

నిజమయినటానికు

## యం. ఆర్టిక్ అండు కంపెనీ

నాంపల్లిరోడ్ హైదరాబాదు-దక్కన్

జిల్లాలలో ఏజంట్లు కావలెను.

ఆల్ఫా ఈక్రింది స్థలములలోదొరకును:— సర్సాయ్ అబ్దుల్‌రజాక్, కెమిస్టులు, కమాన్, అబిడ్‌రోడ్, హైదరాబాదు-దక్కన్ మరియు జేమ్సుస్ట్రీటు సికింద్రాబాదు

ముదలియార్ అండు కం. అబిడ్‌రోడ్ జనరల్ మర్చంటు హైదరాబాదు. ద.

వి. యస్. అబ్దుల్ ఖాదర్, జనరల్ మర్చంటు జేమ్సుస్ట్రీటు, సికింద్రాబాదు

Khan and Sons

## ముఖ్య గమనింపు

ఆనందసుధ:—బలహీనతకు, అందువలన కలిగిన సమస్తవ్యాధులకు 8 ఔ రు 2-8-0

సుధా కస్తూరివటి:— అజీర్ణము, జ్వరము మొదలగు వ్యాధులకు 50 మా॥ రు 0-8-0

ఆరోగ్యసుధ: - సమస్త మేహవ్యాధులకు 60 మా॥ రు 4-0-0

స్త్రీ సుధ:— స్త్రీల సమస్తవ్యాధులకు 60 మా॥ రు 3-0-0

భృంగామలకతైలం: - సమస్త శిరోవ్యాధులకు 4 ఔ. రు 1-0-0

మాధీఫల రసాయనము:- సమస్త పైత్యవ్యాధులకు 4ఔ. రు 1-0-0

పై మందులు అందరికిని విరివిగా సప్లయి చేయబడును.

మావద్ద యింకను 250 రకముల మందులు కలవు.

డాక్టర్ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి అండ్ సన్సు

రాజమండ్రి, M. S.M.Ry

## వీర్యస్తంభనరసాయనము

5 గంటలు వీరకము ఆపును.

తేనెలూరెడి దివ్యౌషధము. వీర్యనష్టముచే పురుషత్వము తగ్గినవారు నవయవ్వనం బట్టి పూర్వమువలె కాముభోగ మనుభవించుటకు, పెట్టినదేదు 30 సంవత్సరములనుండి అనేకమంది రసజ్ఞులు శతావధానులు జడ్జీలచే చదివిచూడబడి భళిరా యనిపించుకొనిన గొప్ప ఖ్యాతిపొందినమందు 2 పూటలలో ప్రత్యక్షగుణము కాకుంటే సొమ్ము వాపసు. 40 దినముల డబ్బి రు.5లు. వి.పి. ఖర్చులు అ 12 కాంపిలు ఆరుడబ్బీలు శేతు

## నపుంసకతైలం

బాల్యమందు ముష్టిమైథునముచేతను సవాహేతుచేతను కాంపరిమితిలేని అతిసంభోగంచేతను అంగము లొక్కరిసి బహుచిన్నదియై ఉద్రేకనశించి స్త్రీకి జూచిన సిగ్గుతో లోపనగ్రహించువారికిది అమృతమై పూర్వమువలె యథాప్రకారము అంగ పుష్టికలిగి తృప్తితీరునట్లు సంభోగ సౌఖ్యము ననుభవింపగలరు. మంది చెప్పునట్లు తడిపిన తైలములవలె మంటలు, కురుపులుకల్గవు. బహుపల్లగా సుహానసగ్గియుండును.

1 సీసా రు 10 లు వి పి 0-12-0

### బంగారు నపుంసక తైలం

ప్రతిదినము భోగేచ్ఛగల శ్రీమంతులకు అప్పటికప్పుడు పైగుణాలన్నియు గలిగించి తనితీర్చ నిత్యభోగశక్తిని కలిగించుటకు కస్తూరి బంగారులతో తయారైన అశ్వబలతైలం 1 సీసా రు 25 వి.పి. అ 12 ప్రమాణికంగా 10 కట్లుదిట్టగాను మొదటి పూటలోనే మంచిగుణము,

## గర్భనిరోధిని

స్త్రీలకు గర్భంరాకుండా పుట్టుటకు 1, 2, సంవత్సరములకు రు, 5లు, 3 4 సంవత్సరములకు రూ 10 లు, ఎప్పటికి శాశ్వతంగా గర్భం రాకుండుటకు రూ 25 లు, వి. పి. అ 12

డాక్టర్ రత్నం అండు సన్సు, మెడికల్ హాల్ ౨౫౨-బి సుల్తానుబజారు హైదరాబాదు

